కృష్ణరాయఁడు తన కపజయము కలుగునని యూహించి తిమ్మ
రుసు గఱపిన హితోపదేశమును బెడచెవినిబెట్టి, యిట్టి విపత్తు
తెచ్చికొంటిని గదా యని పశ్చాత్తప్తుఁడగుచు, మంత్రిని బిలువ
నంపించి, తానడచిన మార్గము తప్పని యొప్పుకొని, కర్తవ్య
మాలోచింపుమని, బహుభంగుల వేడికొనియెను. అప్పుడు
తిమ్మరుసిట్లనియెను.

దేవా! మనము మనరాజధానిని విడిచి బహుదూరము
ప్రయాణముచేసి శత్రుదేశమధ్యమునఁ జిక్కువడి యున్నా
ము. దేశ మరణ్యమయమై యుండుటచేత సులువుగా మన
సైన్యములను మరలించుకొని పాఱిపోవుటకు సాధ్యము
గాదు. కీడెంచి మేలెంచుమన్నట్లు మన కదృష్టము తప్పెనని
మనసైన్యమంతయు సకళింగదేశపుటడవులలో హరించిపోవు
నుటకు సందేహములేదు. అపజయము కలిగినా నింక మన
కురవస్థ చెప్పనక్కఱలేదు. మనకు స్థానబలిమిలేదు. వారలకు
స్థానబలిమి కలదు. ఇంక నసంఖ్యాకములగు సైన్యములను గొని
వచ్చి గజపతి మనపైఁ బడఁగలఁడు. జయాపజయములు భగవ
దధీనములు. ఐనను నిప్పటి పోరాటముయొక్క స్థితినిబట్టిచూడ
మనకు జయము కలుగునని తోఁచదు. ఇట్టి సందిగ్ధసమయమున
యుద్ధమును మాని వెనుకకు మరలుట ప్రమాదమునకు హేతు
వగును. ఏదైన మాయోపాయముచేత నీవిపత్తునుండి తప్పించు
కొని కార్యమును సాధింపఁజూడవలయునుగాని విచారించుట
వలనఁ బ్రయోజనము లేశమాత్రమును లేదు.

## పాత్రసామంతుల మోసపుచ్చుట

మనకిట్టి విపత్తు కలుగవచ్చునని నేనూహించినవాఁడ నగుటచేతనే బెజవాడలో నాఁడు యుద్ధము చాలించి వెనుకకు మరలుదమని చెప్పితిని. అయిననేమి? దీనికై చింతింపకుము. ఉపాయముచేత .యుద్ధమును మాన్పించి తనకూఁతు నీకిచ్చి వివాహముచేసి గజపతి నీతోఁడ సంధి చేసికొనునట్లు గావించి నిన్నీపరిభవమునుండి గాపాడుదును. చూడుము నాశక్తియని పలికి యాతనిఁ బంపివేసి యిట్లు చింతించెను.

మనుష్యుఁడైనవాఁడు తనకార్యమును నెరవేర్చుకొనుటకు సామదాన భేదదండములను చతుర్విధోపాయములఁ బ్రయోగింపవలసి యుండును. ఇచ్చట సామము పనికిరాదు. దండము సాధ్యమగునది గాదు. దానము భేదము నను రెంటివలనను కార్యము సాధింపవచ్చును. పాత్రసామంతులకును వారి ప్రభువునకును భేదము పుట్టించినఁగాని స్వపక్షమునకు జయము సమకూరునట్లు గన్పట్టదు. వంచనచేసి తప్పించుకొనుట కూడ గాని శత్రువునకుఁ దలయొగ్గి నాశనము నొందఁ గోరునంతటి యవివేకిఁ లోకములోఁ నెవ్వఁడుండును? ఇంతప్రఖ్యాతిఁ గాంచిన నాప్రభువునకు నవమానము గలుగుచుండ నుపేక్షించి యూరకుండుట భృత్యధర్మముగాదు. ఇట్టి సందర్భమునఁ జేసిన వంచన రాజనీతికి విరుద్ధముగాదు. అని వితర్కించుకొని తిమ్మరుసుమంత్రి పదియార్వురు పాత్రసామంతులపేరను దురాశను

గల్పించు జాబులను వ్రాసి విశేషముగా ద్రవ్యమును దెప్పించి పదియారు పెట్టెలలో సించించి యొక్కొక్క జాబు నొక్కొక్క పెట్టెలోనుంచి యాపెట్టెలను బరిచారకుల శిరస్సులపైనుంచి శత్రుసైన్యములోనికిఁ బోయి పాత్రసామంతుల కప్పగించి ప్రత్యుత్తరములు తెండని యాజ్ఞాపించిపంపెను. వారలు గజపతి సేనలమధ్యనుండి పెట్టెలను గొనిపోవుచుండ గజపతి వారలనుబట్టి తెప్పించి యాపెట్టెలను గైకొని యందుండు లేఖలను దీసి చదువుకొనఁగాఁ దనపాత్రసామంతులు దనకై కుట్రచేసి రాజద్రోహమున కొడిగట్టినట్లు స్పష్టపడియెను. జాబులలో నిట్లు వ్రాయఁబడి యుండెను.

"శ్రీకృష్ణదేవరాయలవారు మీపద్ధతుల కంగీకరించెను; ఆపద్ధతుల ప్రకారము గజపతిని బట్టి యిచ్చెదరేని మీరు నిర్ణయించిన ప్రకారము గ్రామములును, రత్నాభరములును, ధనమును మీయధీనము చేసెదము."

ఇట్లుండుటను ప్రతాపరుద్రగజపతి చదువుకొని భీతచిత్తుఁడై తాను తప్పించుకొని పోవు మార్గము నాలోచించుకొని పాత్రసామంతులకుఁ దెలియకుండ నితరులకు గోచరము గాకుండ దూరమున నున్న మఱియొకస్థలమునకుఁ బోయి యచ్చట రహస్యముగా నుండెను. తమప్రభువు యుద్ధభూమి యందుఁ గానరాకుండుటం జేసియు, నతనిక్షేమము దెలియకుండుటంజేసియు వారలు యుద్ధమును ముగించి విచారించు

చుండిరి. ఇంతలో వారలకు నోత్తుడు కలుగనీయక తిమ్మరుసు మంత్రి రాయనియాజ్ఞఁ గైకొని గజపతికడకుఁ బోవఁ నతఁ డర్ఘ్యవిధానముల బహుమానపురస్సరముగాఁ బూజించి సంధిని గూర్చి ప్రసంగించుచుండెను. అంకుల కనువగురీతిని తిమ్మరుసు ప్రసంగించి ప్రతాపరుద్రగజపతి రాయనితో సంధిచేసికొని తన కూఁతునిచ్చి వివాహము గావించుటకు నొడంబఱచెను. తరువాత ప్రతాపరుద్రగజపతి తనకూఁతురు తుకాంబ నిచ్చి వివాహము గావించెను. ఈమెనే యన్నపూర్ణాదేవియని యాముక్త మాల్యదయందు కృష్ణరాయఁడు మఱియొక నామమునఁ బేర్కొనియెను. శ్రీకృష్ణదేవరాయఁడు సంతోషించి రాజమహేంద్రపురమువఱకును గలదేశమును మరల గజపతికొసంగి క్రీ. శ. ౧౫౧౬ వ సంవత్సరములోనే పూర్వదిగ్విజయాత్రను ముగించి స్వస్థానమునకుఁ జేరుకొనియెను. తిమ్మరుసు చేసిన మోసమువలన పాత్రసామంతులకు ప్రాణభంగము కలుగలేదు. కృష్ణరాయని విజయప్రతిష్ఠకు భంగము కలుగలేదు. ప్రతాపరుద్రగజపతికి పదభ్రష్టత్వమును కలుగలేదు. భవిష్యత్కాలమున నుభయరాజ్యములకుఁ బోరాటము కలుగకుండ బాంధవ్యమును గల్పించెను. ఇంతయును తిమ్మరుసు కృష్ణరాయునికిఁ గూడ నుండుటచే సంభవించినది. అట్లు కానియెడల చరిత్రము మఱియొక రూపము దాల్చియుండును.

---

# సప్తమ ప్రకరణము

## తిమ్మరుసు తురుష్కులను జయించుట

అట్లు తిమ్మరుసుమంత్రి కృష్ణరాయనితోఁగలిసి సైన్యములను మరలించుకొని సురక్షితముగా నేతెంచి విజయనగరము ప్రవేశించిన వెనుక గోలకొండసుల్తాను మహమ్మద్ కూలీ కుతుబ్ షాహా లక్ష సైన్యముతోఁ గొండవీటిపై దండెత్తివచ్చుచున్నాఁడని తెలియవచ్చెను. అతఁడు కృష్ణరాయనికిఁ జెప్పి రెండులక్షల సైన్యములతో, తురుష్కులను జయించి కొండవీటిదుర్గమును సంరక్షించుటకై బయలుదేఱెను. ఇట్లు బయలువెడలి కొండవీడు సమీపించునప్పటికి కుతుబ్ షాహా కృష్ణానదిని దాటి బెల్లముకొండను వశపఱచుకొని కొండవీటిదుర్గము సమీపమునకు వచ్చెను. అప్పు డుభయసైన్యములకు భయంకరమైన యుద్ధము జరిగెను. ఈయుద్ధమునందు ఆర్వీటినారపరాజు తిమ్మరుసునకు కుడిభుజముగానుండి కొండవీటికడ తురుష్కులతో గిఱ్ఱారియుద్ధము గావించి కుతుబ్ఖాను దల్లడిల్లఁగొట్టి తఱిమెను. ఇచ్చట సుల్తాను కూలీకుతుబ్ షాహా తిమ్మరుసును గాని రాయనిఁగాని జయించినాఁడని ఫెరిస్తా వ్రాసినసంగతి సత్యముకాదు. * ఈయుద్ధమునందే తిమ్మరుసు తన్నెదిరించిన

---

* ఈయుద్ధములోఁ గుతుబ్‌షాహాతో స్వయముగాఁ బోరాడి యాతని నోడించినవాఁడు ఆర్వీటి నారపరాజని కళాపూర్ణోదయములోని యీక్రింది పద్యమువలన స్పష్టపడఁగలదు.

కుతుబ్‌షాహా సేనానియగు మదార్‌మల్‌ఖానుని భార్యాసమే
తముగాఁ జెఱగొని వాని ధనకనకవస్తువాహనాదులఁ జూఱఁ
గొని విజయనగరమునకుఁ బంపివేసెను. ఈ సేనాధిపతియైన
తురుష్క డామరణాంతమును జెఱయందే యుంచఁబడెను. ఇట్లు
తిమ్మరుసు తురుష్కులను దేశమునుండి పాఱఁద్రోలి కొండ
వీటి రాజ్యపరిపాలనమును జక్కఁబఱచుటకు సమకట్టెను.

## తిమ్మరుసు మేనల్లుడు

తిమ్మరుసు కొండవీటిని గజపతులనుండి స్వాధీనపఱచు
కొన్నపిమ్మట నాదిండ్ల అప్పామాత్యుని కొండవీటిరాజ్యము
నకుఁ బరిపాలకునిగా నియమించెనని యిదివఱకు చెప్పియున్నాఁ
డను. తిమ్మరుసు తనతోఁబుట్టువగు కృష్ణాంబికను నాదిండ్ల
తిమ్మామాత్యున కిచ్చెనని ప్రథమప్రకరణమునఁ దెలిపియున్నాఁ
డను. ఆదంపతులకు మువ్వురు పుత్త్రులు గలరు. వారిలో
అప్పనమంత్రి రెండవవాఁడు. గోపనమంత్రి మూఁడవ వాఁడు.
పెద్దవాఁడైన కోనయమంత్రిని గుఱించి మన కేమియును దెలి
యదు. కృష్ణరాయఁడు పూర్వదిగ్విజయ యాత్రకు వెడలు
నప్పుడు గుత్తిదుర్గాధ్యక్షుఁడుగా నున్న తనతమ్ముని గోవింద
రాజదండనాథుని విజయనగరాధ్యక్షునిగ నియమించి తిమ్మ

---

" చ. వచలక యుత్కలేంద్రుని సవాయిబరీదు నడంచు దుర్జయుం
గుదుపనమల్కఁ దల్లడిలఁగొట్టె మహాద్భుతసంగరంబులో
నెదిరిచి కొండవీటికడ నెవ్వరు సాటి విచిత్రశౌర్యసం
పదపస నారసింహవిభుపట్టికి నారనృపాలమౌళికిన్."

రుసు తన మూఁడవ మేనల్లుని గోపనమంత్రిని గుత్తిదుర్గాధ్యక్షు నిగా నిర్ణయించి తన తమ్ముని స్థానమునందు నిలిపెను.* ఇంత వఱకును అప్పనయు గోపనయు దండనాథులుగ నుండిరి. ఇప్పుడు తిమ్మరుసు వీరలను గొప్పరాజ్యములకుఁ బాలకులనుగ నియమించెను. కొండవీటిరాజ్యమునకు గోపనమంత్రిని, వినుకొండ, గుత్తిరాజ్యములకు అప్పనమంత్రినిఁ బరిపాలకులుగా (గవర్నరులను) నియమించెను. కృష్ణరాయని సామ్రాజ్యమున మంత్రులకును గొప్పసేనానులకు నెట్టిమర్యాదలు జరుగుచుండెనో అట్టిమర్యాదల నన్నిఁటిని వీరు పొందుచుండిరి. వీరలు సంస్కృతాంధ్రభాషలయందు మంచిపాండిత్యము గలవారు. అప్పనమంత్రి మాదయగారి మల్లనకవివర్యునిచే రాజశేఖరచరిత్రము నంకితము నొందెను. వీరి దానశాసనములు కొండవీడు, వినుకొండ సీమలలోఁ బెక్కులు గానవచ్చుచున్నవి. వేద వేదాంగ విదులైన బ్రాహ్మణోత్తముల కనేకుల కగ్రహారము లను భూముల నొసంగిరి. దేవస్థానములను జక్కపఱచి దాన ధర్మములను గావించి సంరక్షించిరి. చెఱువులను ద్రవ్వించిరి. మహాకార్యము లెన్నో యాచరించి విఖ్యాతిఁ గాంచిరి. అప్పన మంత్రియు గోపనమంత్రియును రామలక్ష్మణులవలె నన్యోన్య

* "ఉ. ప్రాపితరాజ్యవైభవనిరాకృతిపాకవిరోధి యైనయా
గోపనమంత్రి ధర్మథనగోపనసమ్మతిగుత్తి దుర్గల
క్ష్మీపరిపాలనక్రమసమిద్ధభుజాబలశాలిరూపరే
ఖాపరమత్స్యలాంఛనుఁడ యాహవకార్య ధురంధరుండిలన్.
(రాజశేఖరచరిత్రము)

ప్రియులై యలరిరని మాదయగారి మల్లన కవీంద్రుఁడు నొక్కి వక్కాణించి యున్నాఁడు. *తిమ్మరుసు దేశమునం దెచ్చటను శత్రువులను లేకుండఁజేసి దేశమున శాంతి నెక్కొలిపి మేనల్లుం డ్రను బ్రతినిధిపాలకులనుగా నారాజ్యములందు నిలిపి విజయో త్సాహముతో రాజధానికి వచ్చి రాయనిచే ననేకవిధముల సమ్మానింపఁబడియెను.

## రాచూరి దండయాత్ర

తిమ్మరుసుమంత్రి రాజధాని బ్రవేశించిన వెనుకఁ గొన్ని సంవత్సరములు యుద్ధములు మాని రాజ్యాంగవ్యవహారసంస్క రణంబునమాత్రము బుద్ధినిజొనిపి ప్రజాసౌఖ్యమునకై పాటుపడి యెను. అయినను క్రీ. శ. ౧౫౨౦ వ సంవత్సరములో గృష్ణ రాయఁడు విజాపురసుల్తానుపై దండెత్తిపోయి తురుష్కులను జయించి రాచూరు ముదిగల్లు దుర్గములను బట్టుకొని స్వాధీన పఱచుకొనియెను. ఆదిల్‌షాహా రాజధాని యగు విజాపుర మును విడిచి పాఱిపోయెను. ఈదండయాత్రలోఁ దిమ్మరుసు మాత్రము పాలుగొని యుండలేదు. తిమ్మరుసు తమ్ముఁడు గోవిందరాజు మాత్రము ముప్పదివేల కాల్బలముతో రాయని

---

* కం. అయనుగుండమ్మఁడు విన
యాయతమతిఁ గొల్వ నప్పనార్యుఁడు నతఁడున్
బాయక యన్యోన్యప్రియు
లై యలరిరి రామలక్ష్మణాకృతు లగుచున్.

(రాజశేఖరచరిత్రము.)

వెంటఁ జనియెను. ఏడులక్షల సైన్యమును నడిపించుకొనిపోయి కృష్ణరాయఁడు తురుష్కులతో ఘోరయుద్ధముచేసి సంపూర్ణ విజయము గాంచిన వెనుక విజాపురసుల్తాను సంధిచేసికొని నాటి నుండి చాలకాలము విజయనగరప్రభువులతో మైత్రి గలిగి యుండెను. యుద్ధకాలమునందు స్వాయముగా తిమ్మరుసు పాలు గొనకపోయినను తిమ్మరుసు చూపినమార్గము ననుసరించిపోయి రాయఁడు విజయమును గాంచెను. అట్లు విజయమునుగాంచి కృష్ణరాయఁడు మరలి విజయనగరమునకు వచ్చినవెనుక తిమ్మరుసు రాయని వీక్షించి 'దేవా! సాళ్వనరసింహాభూపాలుఁడు గాని మీతండ్రి నరసింహదేవరాయఁడుగాని, మీయన్న వీర నరసింహదేవరాయఁడు గాని సాధింపలేక విడిచిన వానిని నీవు సాధించి వశపరచుకొంటి' వని బహువిధముల శ్లాఘించెను.

'అప్పా! ఇది యంతయు భవత్కృపావిశేషమువలన నైనది కాని మఱియొండు కా' దని తన కృతజ్ఞతాబుద్ధిని వెల్లడించెను.



# దశమ ప్రకరణము.

## తిమ్మరుసు పరిపాలనము.

ఏనాఁడు సాళువనరసింహాధరాతలేంద్రుడుఁ విజయనగరమునఁ బట్టాభిషిక్తుడయ్యెనో ఆనాఁడు మొదలుకొని నలువది సంవత్సరముల కాలమును తిమ్మరుసు విజయనగరంబునఁ గడపెను. సమకాలికులలో నాతనితో సమానుఁడగు ప్రతిభాశాలి దక్షిణహిందూస్థానమునఁ గానరాఁడు. దక్షిణహిందూస్థానమునమాత్రమేగాదు, భరతఖండమునఁ గూఁడఁ గానరాఁడని చెప్పవచ్చును. కర్ణాటసామ్రాజ్య మనియెడు నీహైందవ సామ్రాజ్యముయొక్క కీర్తి ఖండాంతరములఁ గూఁడ వెలయునట్లు చేసెను. రాజకుటుంబములలో జన్మించిన కలహములనడంచి, అసమర్థులను వెనుకకు నెట్టి సమర్థులను ముందుకుఁ గొనివచ్చెను. తన కాలమునఁ దనకోరిక ననుసరించి నల్వురను పట్టభద్రులను గావింపవలసివచ్చినను రాజధానీ నగరమున నెట్టి విప్లవమును జనింపకుండఁచేసి నగరమును గాపాడిన మహానీయుని కాలమున నెంతయభివృద్ధి కలిగినదన్నను వింతయేముండును? బలాఢ్యుడయిన శత్రురాజులను జయించి రాజ్యము విస్తరింపఁజేసెను. సామ్రాజ్యమధ్యమున జనించిన రాజద్రోహాకరములయిన కార్యముల నన్నిఁటిని నడంచివైచెను. సామ్రాజ్యమునకు లోఁబడిన సామంతరాజును కప్పములు సరిగాఁ జెల్లించినట్లు కట్టుదిట్టము

లను గావించెను. సైన్యముల విషయమై జరిపిన సంస్కారణ మిదివఱకే తెలిపియున్నాఁడను. సైన్యములఁ బరీక్షించి సైన్యాధి పతులకు సైనికులకుఁ బహుమానము లిచ్చుటకు విజయదశమి యుక్తమైన దినముగఁజేసెను. తిమ్మరుసు సమర్థులని తోఁచి నప్పుడు బ్రాహ్మణులకు సయితము సైన్యాధిపత్యము లొసం గుచు వచ్చెను. ఈసామ్రాజ్యమున బ్రాహ్మణులలో తిమ్మరుసు నకుఁ దరువాత మహాసేనాధిపతిగా నున్నవాఁడు రాయసము కొండమరుసు (కొండమరాజు). శ్రీకృష్ణదేవరాయని పూర్వ దిగ్విజయ యాత్రలోఁగూడ నుండుటయేగాక ఆదిల్‌సాహాపై దండెత్తిపోయినపుడు లక్షసైన్యమున కధికారియై యాతని వెంటఁ బోయి తురుష్కులతో యుద్ధముచేసెను. తిమ్మరుసు తమ్ముఁ డగు గోవిందరాజుగూడ కొండమరుసువంటివాఁడే. ముప్పదివేల సైన్యమున కధికారియై కృష్ణరాయని వెంటఁబోయి తురుష్కు లతో యుద్ధముచేసి ఖ్యాతిఁ గాంచినవాఁడే. తిమ్మరుసు కొడుకు గోవిందరాజుకూడ దండనాథుఁడుగ నుండెను. అల్లసాని పెద్ది రాజు (పెద్దయ్యంగారు లేక పెద్దనామాత్యుఁడు), నంది తిమ్మ నామాత్యుఁడు, కవులుమాత్రమేగాక మండలాధిపతులుగఁ గూడ నుండిరి. తిమ్మరుసు మేనల్లుండ్రను గూర్చి వ్రాసియే యున్నాను. ఈ విజయనగర సామ్రాజ్యము ప్రతిష్ఠాపింపఁబడి నది. మొదలుకొని తుదికాలమువఱకు బ్రాహ్మణులవలనఁగూడ బెంపఁబడినదనుటలో సందేహము లేదు. ఈ సామ్రాజ్యము యొక్క ప్రతిరాజ్యాంగ శాఖయందును బ్రాహ్మణ ప్రాబల్య

మెంతకలదో యాకాలమునాటి శాసనములును, వాఙ్మయ మును బరిశీలించిన వారికి బోధపడకమానదు. ఈసందర్భమున శ్రీకృష్ణదేవరాయనికి బ్రాహ్మణులయందెంత విశ్వాసముగలదో యాతనిచే రచింపఁబడిన 'ఆముక్తమాల్యద' యను ప్రబంధము నందలి యీ క్రింది పద్యములనుబట్టి మనము తెలిసికొనవచ్చును.

కం॥ దుర్గములాప్త ద్విజవర
వర్గమునకె యిమ్ము; దుర్గవత్తత్తతిక
త్యర్గళధరాధి రాజ్య వి
నిర్గత సాధ్వసత పొడమనిలుపకు కొలదిన్."
(ఆ. ఆ. ౪. ప. ౨౦౭)

"దుర్గములను నీకాప్తులయిన బ్రాహ్మణులకిమ్ము, వారి మీఁదికి నెట్టి శత్రువులు వచ్చినను వారిని నిర్భయులై తెగటార్చు టకు వారికి నీయనర్గళాది రాజ్యమువలన ఆదుర్గములందు వల సిన సేనాదులను సమృద్ధిగా నుంపుము; అల్పముగా నుంప కుము; లేదా, వారికి రాజ్యగర్వముచేత నీయెడలంగూడ భయము తప్పునట్లు సైన్యాధికమును ఎక్కువఁగా ఇయ్యకుము" —(వేంకటరాయశాస్త్రి కృతసంజీవనీవ్యాఖ్య.)

"ఆ. ఆనభిజాతుఁ. గేకటాలయు నక్రుతు.
నలుకమాని బొంకు పలుకువాని.
నాతతాయి. గడును నన్యదేశ్యు. నధర్ము.
విడుము విప్రునేల వేడితేని." (ప. ౨౦౯)

"నీ దొరతనము నీకే ఉండవలయునని కోరెదవేని బ్రాహ్మణునైనను, నీచకులజుఁడు, బోయలనడుమ జీవించు

వాఁడు, గురుశుశ్రూష చేయనివాఁడు. అనృతవాది, చంప నుద్యుక్తుఁడు, తప్పుచేసియు అలుకనివాఁడు, పరదేశాగతుఁడు, అధర్మపరుఁడు, అగువానిని చేర్పకుము." (అదేవ్యాఖ్య.)

" తే. బాహుజాంఘ్రిజముఖి విడంబనకు నయిన
గొలిచి మనువిప్రధర్మంబు దెలిసియైనఁ
బూని సంకటముల నిల్చుఁగానఁ దఱచు
బ్రాహ్మణునిఁ బ్రభుఁ జేయుట పతికి హితము."

(ప. ౨౧౬)

"రాజు బ్రాహ్మణుని గొప్ప యధికారమునందు నియమించుకొనుటచేత మేలొందును; ఏలయన బ్రాహ్మణుఁడు తాను సంకటములలో నిలువక తప్పినచో తన్ను క్షత్రియ శూద్రాదులు పరిహసింతురనియు, తనవలె రాజులకడదొరలై సేవించు నితరబ్రాహ్మణుల వర్తనము జూచి దాని నవలంబించియు, సంకటములయందు పూనికతో నిలిచి వానిని తొలగించును. (అదేవ్యాఖ్య.)"

ఈపై భావప్రకటనము శ్రీకృష్ణదేవరాయనికి తిమ్మరుసు మంత్రియొక్క ఋజువర్తనమును బరీక్షించుటవలననే కలిగిన దని మనము తలంపవచ్చును. ఇట్టి విశ్వాసము కృష్ణరాయని కుండుటచే సమర్థులయిన బ్రాహ్మణులాకాలమున నుత్తమాధికార పదవులనుగూడఁ బడయుటగూడ దటస్థించుచు వచ్చెను. తిమ్మరుసు రాజ్యపాలనము వహించినది మొదలుకొని మహాసేనాధిపత్యములు, మండలాధిపత్యములు, తెలుఁగువారికే

లభించుచుండెను. తిమ్మరుసు కాలమునాటినుండియు సామ్రాజ్యమునఁ బలుకుఁబడి తెలుఁగువారికే యెక్కువగ నుండెను. విస్తీర్ణమునఁ బెరిఁగినది సామ్రాజ్యము మాత్రమేగాక రాజధానీ నగరముగూడ నానాముఖములఁ బెరిఁగినది. నాగలాపురము మొదలగునవి నూతనముగాఁ గట్టఁబడినవి. మంచిబాటలేర్పడినవి. నగరమునకు మంచినీటి వసతి యేర్పఱచఁబడినది. మహానగరమంతయు జనవృద్ధియు, వస్తుసమృద్ధియు, గలిగి వఱలుచుండెను. నగరాకృతిని వీక్షించినప్పుడును, నగరైశ్వర్యమును దలపోసికొన్నప్పుడును, పాశ్చాత్యులకు సయితము దిగ్భ్రమను బుట్టించి ప్రపంచమున నిట్టి మహానగరమును నెందును జూడలేదని యచ్చెరువందునట్లుగా నుంచెను. తిమ్మరుసునకు సమకాలికులయిన పోర్చుగీసు చరిత్రకారు లెందఱో యామహానగరవైభవమును గన్నులారఁగాంచి యిట్టినగరము ప్రపంచమున లేదని యభివర్ణించి యున్నారు. అట్టి వర్ణనముల సామ్రాజ్య చరిత్రమునఁ బాఠకులు పఠింపఁగలరని యిందు వ్రాయ విరమించినాఁడను.

ఇట్టి మహానగరమునఁ బౌరజనుల మాన ప్రాణ ధనాధులకు నెట్టి యుపద్రవముఁ గలుగకుండఁ బన్నెండువేల యారక్షకభటసైన్యముతో నొక నగరపాలకుఁడు నగరాధ్యక్షుఁడుగా నియమింపఁబడియెను. ఇతఁడిప్పటి పోలీసు కమిషనరువంటి వాఁడు. ఈనగరాధ్యక్షుని కార్యాలయము టంకశాలకు నెదు

రుగ నుండెను. ఒక్కొక్క భటునకు నెలకు ముప్పది పణముల జీత మీయఁబడుచుండెను. వీరికగు ఖర్చు మొత్తమునంతయు జారస్త్రీలపై విధింపఁబడిన పన్నులనుండి గైకొని వ్యయపెట్టు చుండిరి. అమ్మహానగరమున సప్తప్రాకారములమధ్య నెచ్చోట బందిపోట్లుగాని, దోపిడిలుగాని, ప్రమాదములుగాని, దొంగ తనములుగాని, హత్యలుగాని, మఱి యేవిధములయిన యల్లరులుగాని జరుగకుండ జూచు బాధ్యతయును, పాలీనావృత్తాంతమును దప్పక సామ్రాజ్యాధిపతికిఁ బంపుచుండు బాధ్యతయును వహించి నగరాధ్యక్షుఁడు నగరమును బహుజాగరూకతతోఁ బరిపాలించుచుండును. అందువలన నేరములు బహుస్వల్పముగ జరుగుచుండెను. ఇప్పటివలెగాక యాకాలమందు దొంగతనము మొదలగు నేరములకు బహుక్రూరములగు శిక్షలు విధింపఁ బడుచుండుటయుఁగూడ నాకాలమున దొంగతనములు స్వల్పముగ నుండుటకు ముఖ్యకారణమని తలంపవచ్చును. దొంగతనము వృత్తిగఁజేసికొని బ్రదుకునట్టివాఁడు పట్టుబడినప్పుడు తప్పక కాలో చేయో పోఁగొట్టుకోవలసిన వాఁడగును. ఆకాలమున నేరములకు శిక్షలు మాత్రము బహుక్రూరములుగానే యుండెడివని చెప్పవచ్చును. దొంగతనము పెద్దదిగానున్నయెడల మరణశిక్ష యనగా గొడ్డలితో తల నఱుకఁబడుటయే తటస్థించును. అవివాహితలైన కన్యలనుగాని, వివాహితలయిన సాధ్వీమణులనుగాని చెఱచినవానికి మరణదండన విధించుచుండిరి. సామంతుఁడైనవాఁడు రాజుపైఁ దిరుగఁబడి యుద్ధముచేయు

వాఁడైనయెడల వానిచర్మ మొలిపించఁబడును. నీచజాతివాఁ డైనయెడల నెట్టినేరము గావించినను వానితల సంతబజాఱులో నరికివేయఁ బడుచుండెను.

నేరములు చేసిన వారలకు విధింపఁబడెడి శిక్షలు క్రూర ములుగాఁ గన్పట్టినను యుక్తాయుక్తవిచక్షణ లేకుండ గ్రుడ్డిగా విధింపఁబడుచుండ లేదనుటకుఁ బ్రబలసాక్ష్యము గలదు.

మఱియు తిమ్మరుసు ప్రోత్సాహము మూలముననే నూతనములయిన దేవాలయములును, మందిరములును, పట్టణ ములును, కాలువలును ప్రతిష్ఠాపింపఁబడి శిల్పకళలభివృద్ధిఁ గావింపఁ బడియెను. సామ్రాజ్యమున భూమియంతయుఁ గొలతవేయఁబడినది. సుంకములు గొన్ని మాన్పింపఁబడినవి. పూర్వము వివాహముపై సుంకము వేయుచుండిరి. ఇతఁడట్టి సుంకములను మాన్పించెను. దొరతనము వారి ద్రవ్యముతోఁ బ్రజోపకారములయిన కార్యము లనేకములు నెఱవేర్పఁబడినవి. ఇతని కాలమున సంస్కృతాంధ్ర కర్ణాటభాష లభివృద్ధి గాంచి నవి. ఆంధ్రమునకు గౌరవము హెచ్చినది. ఇతఁడు దేవా లయములకును విద్వాంసులయిన బ్రాహ్మణులకు భూదానము లను బెక్కులను గావించుటయేగాక కృష్ణరాయనిచేతఁగూడ ననేక దానములను జేయించెను. మఱియు శైవమని, వైష్ణవ మని భేదమునెంచక శివాలయములకుఁ విష్ణ్వాలయములకును సమముగా దానధర్మములను జరుపుచు వచ్చెను. ఈతని

మార్గమునే యవలంబించి కృష్ణరాయఁడుకూడ తనయాముక్త
మాల్యద యందు వీరవైష్ణవుఁడై వైష్ణవ మతపక్షపాతము
నెంతచూపించినను కార్యాచరణమున సమభావముతోనే ప్రవ
ర్తించెను. శైవులను, వైష్ణవులను సమదృష్టితోనే జూచెను.
వీరినిమాత్రమేగాదు. జైనులఁబట్లఁగూడ సహానమువహించి
జైనపండితులఁగూడ నాదరించుచు వచ్చెను. ఇట్లు హిందూ
జైనమతములు మాత్రమేగాక క్రైస్తవ మహమ్మదీయ
మతములుగూడ వ్యాప్తములగు చున్నను తిమ్మరుసు మంత్రి
శత్రుత్వమును బూనియుండలేదు. తన సైన్యములోఁ గొందఱు
మహమ్మదీయులనుగూడఁ జేర్చుకొని వారి యుపయోగార్థము
విజయనగరమున నొక మసీదునుగూడఁ గట్టించిపించి యిచ్చెను.
అందువలన తిమ్మరుసు కాలమున రాజ్యపరిపాలనము సర్వజన
సమ్మతమై యుండెను. పాశ్చాత్యులైన పోర్చుగీసువారితో
నెప్పుడును విరోధము పెట్టికొని యుండలేదు.

గోవాపరిపాలకులను గౌరవముతోఁ జూచుచువచ్చెను.
ఆబాలవృద్ధులు తిమ్మరుసునకు వినయవిధేయులై వర్తించిరి.
విదేశములతోడి వ్యాపారము విస్తరింపఁజేయబడినది. సామ్రాజ్య
విభవమపారమైయుండెనని పాశ్చాత్యుల వర్ణనములనే ప్రత్యక్ష
సాక్ష్యముగాఁ జూపవచ్చును. ఏసమయమునందయినను అవ
సరమైనయెడల ఇరువదిలక్షలసైన్యమును సమకూర్చుట కనువు
గల్పించెను. వేయునేల? తిమ్మరుసుమంత్రిలేనియెడ కృష్ణదేవ

రాయలు లేఁడని తలంపవలసినదే. కృష్ణదేవరాయని రక్షించిన
వాఁడు తిమ్మరుసు ; కృష్ణదేవరాయనికి రాజ్యమిప్పించినవాఁడు
తిమ్మరుసు ; కృష్ణదేవరాయని దిగంతవిశ్రాంతయశస్కునిగావిం
చినవాఁడు తిమ్మరుసు ; అట్టితిమ్మరుసు తెలుఁగుదేశమునఁ
బుట్టినవాని కెవ్వనికిఁ బూజ్యుఁడుగాక యుండును ?

## అంత్యదశ

శ్రీకృష్ణదేవరాయనికి వాంఛలన్నియుఁ దీఱినవెనుక
నొకదుర్బుద్ధిపుట్టెను. తాను బ్రదికియుండఁగాఁ దనకుమా
రుఁడు పట్టాభిషిక్తుఁడు గావలయునని తలంచెను. తనమరణా
నంతరము తన తమ్ముఁడుగాని, తనయన్నకొడుకుగాని తన
కొడుకును దక్కిమివేసి సింహాసన మాక్రమించుకొందురన్న
భయము జనించెను. తిమ్మరుసుగాని, తిమ్మరుసుతమ్ముఁడుగాని
వానిబంధువర్గముగాని తనకుమారునకుఁ దోడ్పడ కున్నయెడల
రాజ్యము తనకుమారునకుఁ దక్కదను సందేహముపుట్టెను.
తిమ్మరుసునెడ నిర్హేతుకముగా నవిశ్వాస మంకురించెను. దేశ
మంతయుఁ దిమ్మరుసుపలుకుఁబడిలోనుండెను. తిమ్మరుసుబంధు
వులు, మిత్రులు ననేకులు గొప్పపదవులలోనుండిరి. వారి
ప్రాపులేకున్నఁ దనకొడుకు పట్టాభిషిక్తుఁడగుట సంభవింపదని
తలపోసెను. ఇట్లు తలపోసినకొలఁది ననుమానపిశాచము హృద
యమును నానావిధముల బాధింపమొదలుపెట్టెను. ఇట్లు తల
పోసి తలపోసి యొకనిశ్చయమునకు రాఁగలిగెను. ఇట్లు కుటిల

బుద్ధిగలవాఁడై బాలుఁడైన తనకుమారునికి దాను బ్రదికి యుండఁగానే పట్టముగట్టి, వానిపేరిట దానే పరిపాలనము చేయవలయునని యూహించెను. ఆ బాలునిపేరు తిరుమల రాయలట! కృష్ణరాయనికి ముప్వురో నల్వురో దేవేరులు గలరు. ఈతిరుమలరాయలు వారిలో నేదేవికి జనియించెనో తెలియదు. కృష్ణరాయనికిఁ బుత్రికాసంతానమేగాని పుత్ర సంతానమున్నట్లు ఆంధ్రవాఙ్మయమునఁగాని మఱియేవాఙ్మయ మునఁగాని గానరాదు. తుదకీబాలుని 1524 వ సంవత్సరములో సింహాసన మెక్కించి తాను ప్రధానామాత్యుఁడై కార్య నిర్వాహకర్తగ తిమ్మరుసు నేర్పరచి పరిపాలనము చేయనారం భించెనఁట! తిమ్మరుసు కుమారుఁడు గోవిందరాజునకు సేనాధి పత్య మొసంగెనఁట! ఎనిమిది మాసములు సామ్రాజ్యమునం దంతటను మహోత్సవములు సలుపఁబడెనఁట! తానొకటి తలంచిన దైవము వేఱొకటి తలంచెను. ఆకస్మికముగా నొక్క నాఁడేదో జాడ్యమంకురించి యీబాలరాజు మృతినొందుట సంభవించెనఁట! ఇంకేమున్నది? రాయనికి పర్వతము బ్రద్దలై తలపైఁ బడినట్లు తోఁచెను. అతఁడు దురంతసంతాపముచే దురపిల్లుచుండఁగా తిమ్మరుసుకొడుకు తనకుమారునికి విషము పెట్టించి చంపించెనన్న దుర్వార్తయొక్కటి రాయని చెవినిఁ బడియెనట! అతఁడాదుర్వార్త నిశ్చయమునినమ్మి క్రోధావేశ పరవశుఁడై తిమ్మరుసు తనకుఁజేసిన యుపకృతులనన్నిటిని మఱచిపోయి యాతని, దళవాయియైన యతనిపుత్రుని గోవింద

రాజును, నగరాధ్యక్షుఁడయిన యతనితమ్ముని గోవిందరాజును, వారి బంధువులను, తదితరప్రభువరులను, దండనాథులను నెల్ల వారిని రప్పించి కొలువుదీర్చి తిమ్మరుసు మొగముగాంచి యిట్లని పలికెనఁట!

"నిన్ను ప్రాణమిత్రునిగా నెప్పుడును జూచుకొనుచున్నాను. నీవు నాకిచ్చిన యీరాజ్యమున కంతకును నీవేపాలకుఁడవుగా నుంటివి. అయిన నందులకు విశ్వాసముఁ జూపఁజాలను. ఎందుకన నీకు విధ్యుక్తమైన కార్యమును నెఱవేర్చుటయందు మాకుఁ బ్రతికూలముగా వర్తించితివి. నీప్రభువగు నాయన్నగారు నానేత్రములను తీయించి వేయవలసినదని నీకాజ్ఞ చేసినప్పుడు వారియాజ్ఞకు నీవు లోఁబడవలసినవాఁడవై యుండియు నాయనయాజ్ఞను జెల్లింపలేదు. ఆతనికి విధేయుఁడవునుగా లేవు. మీదుమిక్కిలి మేకకన్నులు పెఱికించి తెప్పించి చూపి మోసపుచ్చినాఁడవు. అందువలన నీవును నీతనయులును రాజద్రోహులైరి. ఇప్పుడు నాతనయునకు విషముపెట్టి చంపినారని తెలిసినది. అందుకొఱకే మిమ్ములను జెఱసాలలో ఖైదీలనుగాఁ జేసెద" నని చివాలునలేచి వారలంబట్టుకొని తనకును తనరాజ్యమునకు నేయపాయముఁ గలుగకుండ బోర్చుగీసువారిని తోడ్పడుమని ప్రార్థించెనఁట!

ఇట్లు తిమ్మరుసు తమ్మునితోడను కొడుకుతోడను బట్టువడి చెఱసాలం ద్రోయంబడియెనఁట! కాని తిమ్మరుసు కొడు

కెట్లో చెఱసాలనుండి తప్పించుకొని పోయి తనబంధువగు నొక ద్రవ్యాధ్యక్షుని కడకుఁబోయి సైన్యములం గూర్చుకొని రాయ నితో యుద్ధము చేయుటకు సంసిద్ధపడియెనఁట! తరువాత రాయ లసంఖ్యాకములగు సైన్యములను బంపఁగా రాయల సైన్యములకును తిమ్మరుసు కొడుకు గోవిందరాజునకును గొప్ప యుద్ధము జరిగిన వెనుక గోవిందరాజు శత్రువుచేఁ జిక్కెనఁట! అంత నా శత్రువు వానిని బట్టుకొనివచ్చి రాయనికి నొప్పగించె నఁట! కృష్ణదేవరాయఁడు క్రూరుఁడై కృతఘ్నుఁడై తరువాత వారికన్నులను దీయించివేసెనఁట! ఆవృద్ధబ్రాహ్మణుఁడు చెఱ సాలలో మూఁడుసంవత్సరము లుండి స్వర్గస్థుఁడయ్యెనఁట!

ఇట్టి విషాదకథనమును వ్రాసి విన్పించినవాఁడు కృష్ణ రాయుని కొలువుననున్న "నన్నీజ్" అను పోర్చుగీసు చరిత్ర కారుఁడు. ఇతఁడు 1520 మొదలు 1540 వఱకు నిరువది సంవత్సరముల కాలములోఁ బలుతడవులు విజయనగరమున సందర్శింపుచుండెనని తెలియుచున్నది. ఇతఁడు దక్క మఱియే పోర్చుగీసు చరిత్రకారుఁడుగాని, ఏ మహమ్మదీయ చరిత్ర కారుఁడుగాని, ఆంధ్రకవులు గాని, కర్ణాటకకవులు గాని, మఱి యెవ్వరుగాని యట్టికథనమును బేర్కొనియుండలేదు. ఇంతయ గాక కృష్ణరాయలు మృతినొందునాటికి నాతనికిఁ బదునెనిమిది మాసముల శిశువగు నొకకుమారుఁ డుండెననిగూడ నితఁడు వ్రాసియున్నాఁడు. ఈ నన్నీజు వ్రాఁతనుబట్టి కృష్ణరాయనికి

సిర్వురు పుత్రులున్నట్టు మనకు స్పష్టమగుచున్నది. కాని తిమ్మ రుసుగాని కుమారుఁడు గోవిందరాజుగాని రాయనికుమారుని విషప్రయోగము గావించి చంపుటకుఁ దగుకారణము గాన రాదు.

గోవిందరాజు సేనాధిపత్యమొసంగి తన్నాదరించి గౌర వించి గొప్పపదవికిఁ గొనివచ్చిన ప్రభువునెడ విశ్వాసము లేక ప్రభుపుత్రునకు విషప్రయోగము చేసెననుమాట యెంత విశ్వాసపాత్రమో దురూహ్యమైనవిషయము. తిమ్మరుసునకు విరోధులగువారు సీరిపై నీదోషమారోపించి యుండవచ్చును. ఈకథయె నిజమైన యెడల తిమ్మరుసు శత్రువులకు, తిమ్మరుసు నెడఁ గలుగుపగఁ దీర్చుకొనుటకు మంచియవకాశము గలిగినది. 1525 మొదలుకొని 1530 వఱకును రాజకుటుంబములో సంభ వించిన కలహముల మూలమున సామ్రాజ్యమున విప్లవములు పుట్టి యెట్టెట్టిదుర్ఘటనలను జనింపఁజేసియుండెనో వాని వివర ములను దెలిసికొన్నయెడల మన మిందలి సత్యాసత్యములను దెలిసికొనఁగలుగుదుము. తిమ్మరుసుగాని వాని కుమారుఁడు గాని కృష్ణరాయని కుమారునికి విషముపెట్టించి చంపించుటకుఁ గారణమేమై యుండును? రాయల యనంతరము రాజ్యము రాయని వంశమువారికి గాక వాని ప్రతిపక్షమువారికి సంక్ర మింపఁ జేయవలయుననిగదా యట్టి దుర్మార్గమున కొడిగట్టుట సంభవించును? ఎవరా ప్రతిపక్షమువారు? వాని సోదరులయిన

అచ్యుతదేవరాయలును, రంగరాయలును, సోదరపుత్త్రుఁడయిన నరసింహరాయలును. కృష్ణరాయలు సింహాసనమెక్కినపుడు వీరలు మూవురును జంద్రగిరిదుర్గమునందు చెఱనుంచఁబడి యుండిరి. వారి పక్షమును బూని తిమ్మరుసు, రాజ్యమును కృష్ణరాయని యనంతరము వాని సోదరుఁడైన అచ్యుతదేవ రాయనికిఁ జెందింపఁ జేయవలయునని తలంచి యుండినఁగదా రాయని పుత్త్రునిఁ జంపించుట! సామ్రాజ్యములో సర్వాధి కారములను వహించియున్న తిమ్మరుసేమిభాగ్యమును మూట కట్టుకోవలయునని తన చెప్పుచేతలఁ బ్రవర్తించుచున్న విశ్వాస పాత్రుఁడగు కృష్ణరాయని కాదని ఖైదులో నున్నవాని పక్ష మును బూని చక్రవర్తి కుమారునకు విషము పెట్టించి చంపించు నంతటి దుష్టకృత్యమునకుఁ గడంగి తన ప్రాణములమీఁదికి నాప దలు దెచ్చికొనఁ సాహసించును? ప్రతిభావంతుఁడై యొక మహాసామ్రాజ్యమును జనరంజకముగాఁ బరిపాలించుచున్న తిమ్మరుసువంటివానిని బుద్ధిహీనుఁడని తలంప నవకాశము గలదా ? లేదు. ఇతఁడు తన యాముక్తమాల్యదలోని నాలు గవ యాశ్వాసములో యామునప్రభు రాజనీతిసూక్తములో :—

"చ. చదివి యధర్మభీతి నృపశాస్త్రవిధిజ్ఞతల న్వయస్సు దె
బ్బదిటికిలోను నేఁబదికి బాహ్యమునై యరుజస్వపూర్వులై
మదమటి రాజు ప్రార్థన నమాత్యతగై కొని తీర్చిపారువా
రౌదవిననంగముల్మిగుల నూర్జితమౌటకుఁ బూటపాలదే."

"విద్యనేర్చి, యధర్మములని వెఱపుతోడను, రాజనీతివిధా
నముయొక్క ఎఱుకకలిమితోను గూడియుండి, నలబదింటికి
పై(బడి డెబ్బదింటికి లో(బడిన వయస్సుగలవాడై, ఆరోగ్య
వంతులయిన పూర్వులుగలవాడై, అహంకారమును బోవిడిచి,
రాజుయొక్క ప్రార్థనమువిూ(ద మంత్రిపదమును గైకొని, రాచ
కార్యములు నెఱవేర్చెడి బ్రాహ్మణులు దొరికినయెడ రాజ్యాం
గము లెంతయు బలపడునట్టి వగుటకు నొక్కపూట చాలదా"
అను నర్థమిచ్చునట్టి పద్యమును జెప్పినది తిమ్మరుసువంటి ప్రతి
భావంతుడైన బ్రాహ్మణమంత్రి విగ్రహమును వీక్షించుచు(
జెప్పిన పద్యమని యసి బాలుడు సయితము గ్రహింప(గల(డు.
శుక్రనీతి, చాణక్యనీతి, కామందకనీతి మొదలగువానిలో(
జెప్ప(బడిన రాజనీతినిబట్టి యేబదింటికి బుద్ధి చక్క(గా( బరిపా
కము(జెంది డెబ్బదింటివఱకు( బటిమగలిగి యుండునని గ్రహింప(
గలిగిన కృష్ణదేవరాయలు తిమ్మరుసునెడ నిట్టి నిందారోపణ
కెట్లొడిగట్టవలసివచ్చెనా యని యొకింత సంశయము కలుగ
వచ్చును. ఈ "నన్నిజు" అను పోర్చుగీసు దేశస్థుడు చెప్పిన కథ
నము యథార్థమును దెలుపున దగు నేని నిట్లు జరిగి యుండ
వచ్చును.

ఇంతకు( బూర్వము తన యన్నగారగు వీరనరసింహ
రాయలు తన యవసానకాలమున( దన కుమారునకే రాజ్య
మును జెందింప( జేయవలయునన్న తలంపుతో( గృష్ణరాయని(
జంపి వాని నేత్రములను గొనితెచ్చి చూపవలసినదని తన

మంత్రియగు తిమ్మరుసున కాజ్ఞనిచ్చినపుడు తిమ్మరుసట్టి దుర్మార్గ
మున కొడిగట్టక చావనున్న నాతని సంతృప్తి పఱచుటకై
కృష్ణరాయని దాచియుంచి మేక కన్నులను జూపించి యుండ
వచ్చును. కృష్ణరాయలను మృత్యువాతనుండి తప్పించి నరసింహ
రాయల కుమారుఁడు పసిబాలుఁడగుటచేత సామ్రాజ్యభారము
నిర్వహింపఁగలవాఁడు యౌవనప్రాదుర్భావముతో నొప్పు
చుండిన కృష్ణరాయలే సమర్థుఁడైనవాఁడని యెంచి కృష్ణరా
యునిఁ బట్టాభిషిక్తుని గావించియుండిన మాట సత్యమె. ఇట్టి
పని ప్రధానామాత్యుఁడు నిర్వర్తింపవలసిన విధ్యుక్తధర్మము
లోనిదే కాని యన్యముగాదు. ఇదియంతయు జ్ఞప్తియందుంచు
కొనియె తన యన్నవలెనె తాను తన సవతిసోదరుల జెఱలో
నున్నవారినిఁ గడతేర్చినయెడల సామ్రాజ్యము తన కుమారు
నికే యుండఁగలదని తలపోసి తన మనోభిప్రాయమును దన
కాప్తుఁడైన తిమ్మరుసునకుఁ దెలియఁజేసి యుండును. అందుల
కాతఁ డొడంబడక తన యన్న తన్నుఁ జంపుటకుఁ బ్రయ
త్నింపఁ దన్ను రక్షించిన విధానమును జెప్పి యాతని మంద
లించి యాదుష్కార్యమునుండి తొలఁగించి యుండును. ఇంతియ
గాక చెఱలోనున్నవారి రక్షణభారమును దాను వహించి
వారిని చెఱనుండి విడిపించి యుండును. అందువలన నాతనికి
గొప్ప యనుమానమును భయమును బుట్టి తాను బ్రదికి
యుండఁగానే తన కుమారునకుఁ బట్టముఁగట్టి వానికి వయస్సు

వచ్చువఱకుఁ దానే పరిపాలనము చేయుచుండవచ్చు నని కోని యెను. తన కుమారునికై తాను సింహాసనమును విడిచిపెట్టి 1524 సంవత్సరమున వానిని బట్టాభిషిక్తుని గావించి సామ్రాజ్యమునంతటను దెలియుటకై యెనిమిది మాసముల వఱకు సామ్రాజ్యమునందంతటను మహోత్సవములు జరిపించుచుండె నఁట. 1525 సంవత్సరములోఁ గృష్ణరాయనికి చాల జబ్బుచేసి మంచమెక్కుట సంభవించెను. శా. శ. ౧౪౪౬ (గతించిన) తారణనామ సంవత్సర మార్గశిర శుద్ధ ౨ శనివారమునాఁడు (1525) కృష్ణరాయని కుమారుఁడగు తిరుమలదేవరాయుని పేరిట శాసనములో కోసప్పనాయకుఁడను నొకానొక భృత్యుఁడు దేవరాయనికి గంగోదక మిచ్చినట్లు చెప్పబడి యుండుటచేత నితఁడు చావునకు సిద్ధమయ్యెనని తలంపవచ్చును. కాని చావ లేదు. మఱికొంతకాలము బ్రదికియుండెను. ఇంతలో నాతని దురదృష్టవశమున నాకస్మికముగాఁ గుమారునకు జబ్బుచేసి మృతినొందుట సంభవించెను. తిమ్మరుసు శత్రువులగువారు తిమ్మరుసో వాని కుమారుఁడో కృష్ణరాయని కుమారునకు విషము పెట్టి చంపించినారను ప్రవాదమును బుట్టించి లోకమున వ్యాప్తి నొందింపసాగిరి. అట్టి ప్రవాద మానోట నానోటఁబడి యయ్యది క్రమముగా రాయల చెవులఁబడి యాతని కున్మాదము పుట్టించి యుండును.

అట్టి యున్మాదావస్థయందుండినప్పుడే యిట్టివైపరీత్యము జరిగియుండును. ఇట్లు తన మనోభీష్టమునకు భంగము కలుగు

టయు, తాను ప్రేమించిన కుమారుఁ డాకస్మికముగా మృతి నొందుటయు, తనప్రాణములను గాపాడి తన్నసేకవిధముల రక్షించుచు సామ్రాజ్యమిప్పించి యింతయభివృద్ధికిఁ దెచ్చిన ప్రాణదాతను మంత్రిపుంగవునట్లు కృతఘ్నుఁడై సుఖపడవలసిన వార్ధక్యమునఁ గన్నులుతీయించి హింసించుటయు మొదలగున వన్నియుఁ గలిసి దురంతపరితాపమును గలిగించి యారోగ్యమును జెఱచుచుండుటచేత మొలకెత్తినజాడ్యము కుదుటఁబడక మఱింతవృద్ధియై రాజ్యపరిపాలనమునుగూర్చి నూతనములయిన మార్గ్యలను గావింపవలసి వచ్చెను. కృష్ణదేవరాయ లేసంవత్సరమున మృతినొందెనో సరిగా గుర్తించి చెప్పుట సాధ్యముగాకయున్నది. ఇతని వెనుక నీసామ్రాజ్యమును పరిపాలించుటకు వారసు లిర్వురుసోదరులును (అచ్యుతరాయలు, రంగరాయలు) అన్న కుమారుఁడు (నరసింహరాయలు) ను, పదునెనిమిది మాసముల వయస్సుగల శిశువు కృష్ణరాయని కుమారుఁడును గలరని నన్నిజు వ్రాసియున్నాఁడు. నన్నిజు ముగ్గురు సోదరులని వ్రాయుట పొరపాటు. ఇర్వురేగాని ముగ్గురుకాదనుట స్పష్టము. కృష్ణరాయలు తన మరణమునకు ముందు జబ్బుపడి జాడ్యముద్రేకించి యుండుటచేత నింకఁదాను బ్రతుకనని నిర్ధారణము చేసి యొక మరణశాసనము వ్రాయించెననియు, శిశువైన తన కుమారుని, తక్కినవారిని విడిచి, తన సోదరులలోఁ బెద్దవాఁడయిన అచ్యుతరాయలనే తనవెనుకఁ బట్టాభిషిక్తునిగాఁ జేయ

వలసినదనియు వ్రాయించి యున్నాఁడనియుఁ దెలిపియున్నాఁడు. చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండారమునను స్థానికచరిత్ర వృత్తాంతములుగల సంపుటములలో నొకదానియం దుదాహరింపఁబడిన పద్యములోఁ గృష్ణరాయలు శా. శ. ౧౪౪౨ నగు తారణసంవత్సర జ్యేష్ఠ శు. ౨ భానువాసరమునాఁడు స్వర్గస్థుఁడయ్యెనని తెలుపఁబడియున్నది. ఆకాలమునాటి శాసనములను బరిశోధించినచోఁ గృష్ణరాయలు 1529 వఱకు బ్రదికియున్నట్లు దెలిపెడు శాసనములు పెక్కులు గన్పట్టుచుండుటచేఁ గొందఱీ పద్యమును గల్పనగా భావింతురు.

తనచే విరచింపఁబడిన "అచ్యుతరాయాభ్యుదయ" మను కావ్యమునందు రాజనాథడిండిమభట్టను కవీంద్రుఁడు తిరుపతిలోని శ్రీవేంకటేశ్వరస్వామివారి సాన్నిధ్యమందు అచ్యుతదేవరాయనికిఁ దొల్త బట్టాభిషేకముఁ జరిగినట్లుగాఁ దెలిపియున్నాఁడు. కాళహస్తిపుణ్యక్షేత్రమున నొకశాసనములో శా. శ. ౧౪౫౧ అగు విరోధినామసంవత్సర కార్తిక బహుళ గురువారమునాఁడు (21 అక్టోబరు 1529) అచ్యుత దేవరాయలు విజయనగరసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడైనటుల దెలుపఁబడినది. అచ్యుతదేవరాయలను దనమరణానంతరము సామ్రాజ్యాభిషిక్తునిఁ గావింపవలసినదని కృష్ణరాయలు మరణశాసనరూపమున నాజ్ఞాపించినపుడు 1526 లో రాజధానీనగరమునకు దూరముగానున్న తిరుపతిలో శ్రీవేంకటేశ్వరసన్నిధానమునందు మొదటను, 1529 లో కాళహస్తిలో

కాళహస్తిదేవుని సన్నిధానమున రెండవమారును రెండుతడవు లేల పట్టాభిషిక్తుఁడు గావలసి వచ్చెను? అచ్యుతరాయలు రాజధానీనగరమైన విజయనగరమునకు రప్పింపఁబడకుండుటకుఁ గారణమేమి? తనకు పదునెనిమిది మాసముల కుమారుఁడుండఁగా వానివిడిచి తనరాణులను, సుప్రసిద్ధుఁడైన తనజామాత అళియరామరాజును కాదని తాను సింహాసనమెక్కినది మొదలు కొని యప్పటివఱకుఁ బదునాఱుసంవత్సరములకాలము చంద్రగిరిదుర్గములో ఖైదులోనుంచిన యచ్యుతరాయల నొకనిమాత్రముగా నౌదార్యబుద్ధితో దనయనంతరము పట్టాభిషిక్తునిఁజేయవలెనని తనమరణశాసనములో వ్రాయించినట్టు వ్రాసినచరిత్రకారుఁడే కృష్ణరాయలమరణానంతరము 'సాల్వాని' అనునాతఁడు రాజ్యమునకంతకుమంత్రియై చంద్రగిరిదుర్గమునుండి యచ్యుతరాయలు విజయనగరమునకు వచ్చువఱకును రాజ్యపరిపాలనముఁ జేసెనని కూడ వ్రాసినాఁడే.

పోర్చుగీసుచరిత్రకారుఁడయిన నన్నీజుచేఁ బేర్కొనఁబడిన "సాల్వానీ" మంత్రి 'సాళువతిమ్మరుసు' మంత్రియని భ్రమింపరాదు. ఏమన నాతఁడు చెఱలోనుంపఁబడి కన్నులఁ బెఱికింపఁబడినవాఁడని వ్రాసినదీ చరిత్రకారుఁడేయైనప్పుడు "సాల్వానీ" మంత్రి తిమ్మరుసని యెట్లర్థముచేసికొనఁగలము? ఆతఁడు మఱియొకఁడై యుండవలయునుగదా. ఈసందర్భమున నీతనిచరిత్రము నొకించుక తెలుపవలసియున్నది. ఇతఁడుకాంచీపురవాస్తవ్యుఁడయిన తాళువకుళిందభట్టరను బ్రాహ్మణుని

కుమారుఁడు. చెల్లప్పయను పేరుగలవాఁడు. ఇతఁడు శాసనములలో వీరనరసింగనాయకుఁడనియు, సాళువదండనాయకుఁడనియు వ్యవహరింపఁబడుచువచ్చెను. ఇతఁడు కృష్ణరాయనికి ముందునుండియు సామ్రాజ్యమున నొకయధికారపదవిలో నుండి క్రమముగాఁ బైకివచ్చినట్లుగన్పట్టుచున్నది. వీనిశాసనములు 1510 నుండి 1531 వఱకు గన్పట్టుచున్నవి. ఇతఁడు 1510 లో మధురమండలములోని తిరుపత్తూరుప్రాంతప్రదేశమున కధికారిగానుండి తరువాత 1515 నుండి చోళరాజ్యమున కంతకును ప్రభువై తరువాత దక్షిణదేశమునకుఁ బ్రతినిధి పాలకుఁడై విజయనగరసామ్రాజ్యమునఁ బేరుప్రఖ్యాతులు గలిగిన మహాసామంతులలో నొక్కఁడుగానుండెను. ఇతఁడు కృష్ణదేవరాయలు బ్రదికియున్నంతవఱకు పరమవిశ్వాసముతో నాతనిసేవించి యుండినవాఁడు. ఈతనిరాజ్యమునుండి కోట్లకొలదిద్రవ్యము సామ్రాజ్యమునకు వరుమానముగాలభించుచుండెను. ఇతఁడు అచ్యుతరాయలకు మొదట విజయనగరసింహాసన మధిష్ఠింపఁజేయునంతవఱకుఁ బట్టుకొమ్మగానుండి తదనంతర మొకసంవత్సరములోగర్భశత్రువుగామాఱిపోయి యటుపిమ్మట చక్రవర్తిపై తిరుగుబాటుచేసి మహాఘోరయుద్ధములుసలిపి పరాజితుఁడైనవాఁడు. అళియరామరాయలకుఁ బ్రతిస్పర్థిగ నిలువఁగలిగిన మహావ్యక్తిగాని సామాన్యవ్యక్తి కాఁడు. ఎంతోబలము, పలుకుబడిగలవాఁడగుటచేతనే అచ్యుతదేవరాయలు వీనిఁజేఁబట్టెను. అచ్యుతరాయలీతని ప్రాపును

నమ్మకొనియె తిరుపతిలోను, కాళహస్తిలోను రెండుమాఱులు పట్టాభిషిక్తుఁడై తానే విజయనగరసామ్రాజ్యాధిపతినని ప్రకటింపఁగలిగినవాఁడు. ఇందుచేతనే నెల్లూరుమండలములోని కమ్మరపూడిలోని యొకశాసనములో శా. శ. ౧౪౪౮ అగు పార్థివసంవత్సరములో అనఁగా 1526 సంవత్సరములో అచ్యుతదేవరాయలు విజయనగరమున వజ్రసింహాసనమధిష్ఠించి సామ్రాజ్యపరిపాలనము చేయుచున్నట్లు తెలుపఁబడినది. ఇంతియగాక మైసూరుమండలములోని సిద్దఘట్టతాలూకాలోని వెంకాసుపేటగ్రామములోని యొకశాసనములో శా.శ. ౧౪౫౦ అగు సర్వధారిసంవత్సరములో అచ్యుతదేవరాయలు చక్రవర్తి వహించు "మహారాజాధిరాజ రాజపరమేశ్వరేత్యాది బిరుదావళితోఁ బ్రశంసింపఁబడియుండుటయేగాక విజయనగరమునుండి సామ్రాజ్యపరిపాలనము చేయుచున్నట్టు తెలుపఁబడినది. ఈసంవత్సరము 1528 కాని 1529 సంవత్సరములో అచ్యుతరాయలు చెల్లప్పనే వీరనరసింగరాయనాయక సాళువదన్నాయకరుని పుణ్యముకొఱకు తిరువాగత్తీసుపురములోని ఉడైతంబిరానారు దేవాలయమునకు 'పనైత్తాంగన్' అను గ్రామమును దానముచేసినట్లుగా ఉరత్తూరుశాసనమునఁ దెలుపబడినది. రాజు పుణ్యముకొఱకు నౌకరు దానముచేయుట కొంచెము విరుద్ధముగఁ గన్పట్టకమానదు. అందులో విజయనగరసామ్రాజ్యసార్వభౌముఁడై యుండిన అచ్యుతదేవరాయలంతటివాఁడు తనకుమ్రొక్కి నమస్కరించెడి సామంతుని

పుణ్యముకొఱకు దేవునకు నొకగ్రామమును దానముచేయుట విరుద్ధముగాఁ గన్పట్టదా! సాళువతిమ్మరుసుమంత్రి శ్రీకృష్ణ దేవరాయలను సామ్రాజ్యాధ్యక్షునిగాఁ జేయుటకెట్లుతోడ్పడి యెనో అట్లే అచ్యుతరాయలను విజయనగరసామ్రాజ్యాధ్య క్షునిగాఁజేయుటకు నీసాళువచెల్లప్పభట్టనే వీరనరసింహామంత్రి తోడ్పడియెనని మనము భావింపఁగలిగినయెడ నిందు విరుద్ధ ముగాఁ గాన్పించునదేమియుఁ గన్పట్టదు. కృష్ణదేవరాయలు 1526 మరణించినను 1529 లో మరణించినను ఉరుత్తూరుశా సన సంవత్సరమునాటికి (1529) అచ్యుతదేవరాయనికి విజయ నగరమునఁ బ్రవేశించుటకవకాశము చిక్కియుండలేదనుట నిశ్చయము. అందుకై సాళువనరసింగరాయనాయకుని బ్రాపు ననేయుండి రాజధానీనగరమగు విజయనగరము నాక్రమించు కొని యందలి వజ్రసింహాసనమునఁగూరుచుండి పట్టాభిషిక్తుఁ డగుటకు దృఢప్రయత్నమునుగావింపుచుండెనని తలంచుటలో వ్యతిక్రమమేమియుఁ గన్పట్టదు.

ఇందు కింకొక దృష్టాంతమును జూపెదను. కన్నడ దేశమున సొరాబు తాలూకాలోని యొకశాసనములో దాన కర్త "అచ్యుతరాయల పాలనము సామ్రాజ్యమున సుస్థిర ముగా నుండవలయునని కోరుచు దానముచేసి యుండెను. ఇయ్యది 1529 లోనిది. ఈ శాసనకాలమునాటికి అచ్యుత రాయల పట్టాభిషిక్తత స్థిరపడియుండ లేదనుట స్పష్టము. అచ్యుతరాయలఁగూర్చిన పైసందర్భ విషయము లిట్లు ఘోషిం

పుచుండగా 1526-27 సంవత్సరములో అనఁగా శా.శ. ౧౪౪౮ సరియగు వ్యయనామ సంవత్సర వైశాఖశుద్ధ పూర్ణిమనాఁడు విజయనగరమున వజ్రసింహాసనారూఢులయిన మహారాజాధి రాజ రాజపరమేశ్వర బిరుదాంచితులై ఆరవీటి రామరాయలచే నమలనేని కుమార పెదబుచ్చినాయనింగారొక కొలు పొందినట్లొక శాసనములోఁ దెలుపఁబడినది. ఈశాసనమునఁ బేర్కొనఁబడిన రామరాయలే అళియరామరాయలు. ఇతఁడు కృష్ణరాయని యల్లుఁడనుట స్పష్టము. ఈశాసనమునుబట్టి 1526-27 సంవత్సరములనుండి అళియరామరాయలు రాజధానీనగరమగు విజయనగిరమునుండి సామ్రాజ్య పరిపాలనము చేయుచుండెననుట స్పష్టము. ఇంతియగాక మహమ్మదీయ చరిత్రకారులైకకంఠ్యముగా కృష్ణదేవరాయల మరణానంతరము శిశువుగా నున్నవాని కుమారుని పట్టాభిషిక్తుని గావించి అళియరామరాయలే సామ్రాజ్యపరిపాలనమునకుఁ బూనుకొనియెనని వ్రాసియుండిరి. కాని అచ్యుతదేవరాయల ప్రశంస చేసినవారుకారు. ఇట్లు విజయనగర సామ్రాజ్యమును వశముఁ జేసికొనుటకై రెండు పక్షము లేర్పడినవి. అచ్యుతదేవరాయల బావమఱఁదులయిన సలకము పెదతిమ్మరాజును, సలకము చినతిమ్మరాజును, మహాపరాక్రమవంతుఁడయిన సాళువ వీరనరసింగరాయనాయకుఁడును మఱికొందఱు మండలాధిపతులును అచ్యుతరాయల పక్షమునను, అళియరామరాయలును వాని సోదరులు తిరుమలదేవరాయలును, కృష్ణదేవరాయల రాణు

లును, మఱికొందఱు మండలాధిపతులును కృష్ణదేవరాయల కుమారుఁడని చెప్పఁబడెడి శిశువు పక్షముననుండి కృష్ణరాయలు మృతిజెందిన వెనుక 1530 సంవత్సరమువఱకుఁ దగవులాడుచు నుభయపక్షములవారు తమ పక్షములను బలపఱచుకొనుచుండి రని మాత్రము విశదపడకమానదు. కృష్ణరాయలు చనిపోవు నపుడు తన తరువాత అచ్యుతదేవరాయలను బట్టాభిషిక్తుని గావించి తాను యువరాజుగానుండి సామ్రాజ్యపరిపాలనము నందు తోడ్పడుచుండవలసినదని రామరాయల కాజ్ఞాపించెనని పెనుగొండ కైఫియతునందుఁ దెలుపఁబడినది. పోర్చుగీసు చరిత్రకారుఁడైన ఫాదిరీక్వెరోజను నాతఁడు తాను వ్రాసిన సింహళవిజయమను చరిత్రమునందు వ్రాసిన వ్రాఁతపై కైఫియతునందలి యభిప్రాయమునే బలపఱచుచున్నది. మఱియు నీతఁడు కృష్ణరాయని యాజ్ఞను శిరసావహించి రామరాయలు ప్రవర్తించెననియు, అందు కాతఁడు చూపిన దయకు సంతోషించి తనతోఁ గలిసి రాజ్యమును బరిపాలించుట కంగీకరించె ననియు, ఆదోషమువలన రామరాజు నే నిజమైన రాజుగా లోకము గ్రహించుటయు, హక్కు కలిగియున్న రాజగు అచ్యుతదేవరాయలను లోకము గ్రహింపలేకపోవుటయు సంభవించి అందుకు ప్రతిఫలముగాఁ దగు శిక్ష నాతఁ డనుభవించె ననియు వ్రాసియున్నాఁడు. కాని 1530 సంవత్సరములో విజయనగరమున అచ్యుతదేవరాయలు నిజముగాఁ బట్టాభిషిక్తుఁ డగువఱకు వీనికిని రామరాయలకును మైత్రి కుదురలేదు.

అచ్యుతదేవరాయల పక్షమువారయిన వాని బావమఱదులు సలకము పెదతిమ్మరాజు, సలకము చినతిమ్మరాజును చోళరాజ్యాధిపతిగనుండి అచ్యుతదేవరాయకిఁ బరమమిత్రుఁడుగా నుండిన సాళువ వీరనరసింగరాయని సహాయముతో నసంఖ్యములగు సైన్యములతో విజయనగరముపై దాడిసలిపి రామరాయాదులను రాజధాని నగరమునుండి పాఱద్రోలిన వెనుకనే అచ్యుతదేవరాయలను చంద్రగిరినుండి రప్పించి వానిని విజయనగరమున బట్టాభిషిక్తుని జేయుటయు, సాళువ వీరనరసింగరాయని ప్రధానమంత్రిగా నియమించిన వెనుకనే అచ్యుతదేవరాయలు రామరాయలతో మైత్రిచేసికొని ఫాదిరీక్వైరోజు వ్రాసిన చందమున జరిగియుండునుగాని కృష్ణదేవరాయలు 1529 వఱకు బ్రదికి యుండెనని చెప్పెడి విషయములు విశ్వాసపాత్రములుగాఁ గన్పట్టవు. 1526 సంవత్సరములోనే కృష్ణదేవరాయలు మృతినొంది యుండుటయే సత్యమగునుగాని యాతఁడు 1530 బ్రదికియుండెననుట విశ్వాసపాత్రముకాదు. అంతవఱకు నతఁడు బ్రదికియున్నయెడలను, అతఁడు తనవెనుక నచ్యుతదేవరాయలను బట్టాభిషిక్తుని జేయవలసినదని యాజ్ఞాపించినపుడును, అచ్యుతదేవరాయలు తిరుపతి కాళహస్తులలో రెండుసారులు పట్టాభిషిక్తుఁడగుటకుఁ బ్రమేయము గానరాదు. కృష్ణరాయలు వెంటనే అచ్యుతదేవరాయలను తన దగ్గఱకు రప్పించుకొని తన సంరక్షణమున నుంచుకొనియే యుండును. అట్టి పనిచేసి యుండలేదు. అళియరామరాయలు కృష్ణదేవరా

యులు వహించు బిరుదములను 1526 - 27 సంవత్సరములోఁ దానే వహించి రాజైనట్టుల ప్రకటించుకొని యుండుట సంభవింపదు. కనుక కృష్ణదేవరాయులు 1526 లోనే మృతిఁబొంది యుండుట యనే సత్యము కావలయును. కృష్ణరాయులు 1526 లో మృతిఁబొందినను అళియరామరాయాదు లావిషయను గోప్యముగానుంచి అచ్యుతదేవరాయనికిఁగాని వాని పక్షమువారికిఁ గాని 1530 వఱకు విజయనగరమునఁ బ్రవేశము కలుగనీయక యుందురు. అందువలన వానికిఁ బ్రతిపక్షులగువారు, వాని మృతిని వెల్లడించి అచ్యుతదేవరాయనికిఁ దిరుపతి కాళహస్తులలోఁ బట్టాభిషేకకార్యమును బట్టుదలతో జరిపియుందురు. ఇట్టి తగవులాట సమయమున విజయనగర సామ్రాజ్యము తెఱువఁబడిన యిల్లువలె నుండును. ఇట్లుండుటచేతనే యీయదను గనుపెట్టి యుత్తరమున గోలకొండ సుల్తాను, ఒడ్డె రాజగు ప్రతాపరుద్రగజపతి విజయనగర సామ్రాజ్యముపై దండయాత్రలు సాగించిరి. ఈసందర్భమున అల్లసాని పెద్దనామాత్యుని చాటు పద్యముగూడ ప్రబలసాక్ష్యము గానున్నది. ఒడ్డెరాజగు ప్రతాపరుద్రగజపతి విజయనగరముపై దండెత్తి వచ్చినప్పుడు పెద్దన్న చెప్పిన పద్య మిట్లున్నది.

" సీ. రాయరావుతుగండరాచయేనుఁగు వచ్చి
యారట్లకోన గోరాడునాఁడు
సంపెటనరపాల సార్వభౌముఁడువచ్చి
సింహాద్రిజయశిలఁ జేర్చునాఁడు

సెలగోలుసింహంబుచేరి ధిక్కృతి గంచు
తల్పులఁగరుల దీకొల్పినాఁడు
ఘనతరనిర్భర గండపెండరమిచ్చి
కూఁతురాయలకును గూర్చినాఁడు
గీ. ఒడలెఱుంగవొ చచ్చితో యుర్విలేవొ
చేరఁజాలక తలచెడి జీర్ణమైతొ
కన్నడంబెట్లు చొచ్చెదు గజపతీంద్ర !
తెఱచినిలు కుక్కచొచ్చిన తెఱగు తోప."

కృష్ణదేవరాయలు లేకపోవుటవలనను, ఈపోరాటముల మూలముననుఁ తెఱచిన యింటివలె రాజ్యమున్నదను భావమును వెల్వరించెను. ప్రతాపరుద్రగజపతి దండెత్తివచ్చుటకుఁ బూర్వమునసే నెల్లూరుమండల ప్రాంతప్రదేశమునంతయు నంచు ముఖ్యముగా చంద్రగిరిరాజ్యమును, ఉదయగిరి రాజ్యమును అచ్యుతదేవరాయల వశమై యుండుటచేతను సాళువ వీరనరసింగరాయని సాహాయ్యముతో సైన్యముల సమకూర్చుకొని పోయి అచ్యుతదేవరాయలు ప్రతాపరుద్రగజపతి నెదుర్కొని గొప్పయుద్ధముచేసి యోడించెను. అచ్యుతరాయల యాస్థానకవి యగు తాళ్ళపాకబ్రహ్మరాజీయ గ్రంథకర్త రాధామాధవీయకవి గూడ నీవిజయమును దెలుపుచు నుత్కల ప్రభువుపట్ల నొకించుక దయను జూపెనని తెలిపియున్నాఁడు. ఈయుద్ధము 1529 లో జరిగియుండవచ్చును కాని యీదండయాత్ర సలుపుటకు ప్రతాపరుద్రగజపతికిఁ గొంతకాలము పట్టియుండును.

ఈయుద్ధ మెప్పుడు జరిగినను అచ్యుతదేవరాయలు విజయనగ
రము ప్రవేశింపక మునుపే జరిగియుండును. కనుక కృష్ణదేవ
రాయలు 1526 లోనే మృతినొందె ననుట విశ్వాసపాత్ర
మయిన విషయము. సాళువ వీరనరసింగరాయమంత్రిపుంగవుని
సహాయ్యముతో అచ్యుతదేవరాయల బావమరదులు సలకము
పెదతిమ్మరాజు, సలకము చిన్నతిమ్మరాజు విజయనగరముపై
దండెత్తి వచ్చినపుడు రామరాయలును, వాని సోదరులును
విజయనగరమును విడిచి పోయి యాదవాని దుర్గమును జేరవల
సినవారైరి.

ఇట్లు అళియరామరాయల సోదరులు విజయనగరమును
విడిచి పలాయనులయిన వెనుక సలకము సోదరులును, వీరనర
సింగరాయలును చంద్రగిరి దుర్గమునుండి అచ్యుతదేవరాయలను
రప్పించి వానిని విజయనగరమునఁ బట్టాభిషిక్తునిగావించి అనేక
హిరిదానములను బ్రాహ్మణులకును, దేవాలయములకును జేసి
[illegible]శిరి. ఆవెంటనే అచ్యుతదేవరాయలు తనకింత మహోప
కారమును గావించిన వీరనరసింగరాయలను బ్రాహ్మణమంత్రికిఁ
బ్రధానామాత్యపదవి నొసంగెను. ఇట్లొక సంవత్సరము జరిగిన
కనుక అచ్యుతదేవరాయలు బలాఢ్యుడయిన అళియరామ
రాయలతో విరోధముగా నుండుట యపాయకరమని యెంచి
తనతోగూడ అళియరామరాయలు పరిపాలనము చేయుటకు
సమ్మతించి వానితో రాజీ చేసికొని వానిని విజయనగరము

నకు రప్పించుకొనియెను. రామరాయ లేమిబోధించెనో కాని సంవత్సరకాలము గడచిన తరువాత ప్రధానామాత్యుఁడు వీర నరసింగరాయలు చేసినకార్యములన్నిటిని తారుమారుచేసి వానిని తుదకు ప్రధానామాత్యపదవినుండి తప్పించి యథాస్థానమునకు బంపించెను. తరువాత నచ్యుతదేవరాయల కతఁడొక గొప్ప శత్రువై చాల బాధలు కలుగఁజేసెను. దక్షిణదేశమున గొప్ప తిరుగుబాటు సంఘటింపఁజేసెను.

ఈపై విషయములన్నియుఁ గృష్ణదేవరాయలమృతికిఁ బూర్వమునందును బరమందును జరిగినవిగా నున్నవి. కృష్ణదేవ రాయలు తన యవివేకమువలనఁ దన యవసానకాలమంతయు దుఃఖప్రదముగాఁ జేసికొని స్వర్గస్థుఁడై పోయెను. 1526 వ సం॥ రము మొదలుకొని తిమ్మరుసుయొక్కఁగాని వాని సంతతివారి యొక్కగాని వారిబంధువులయొక్కగాని చరిత్రముగాని విజయ నగరసామ్రాజ్యచరిత్రమున వినంబడదు. ఈకడపటివృత్తాంతము నొక్క నన్నీజు మాత్రమే పేర్కొని యుండెనుగాని మఱియే చరిత్రకారుఁడును విజాతీయులలోఁగాని స్వజాతీయులలోఁగాని పేర్కొన్నవారు గానంబడరు. ఇందలి నిజమేమో లోకమెఱుంగదు. [illegible]రియదృష్ట మట్లున్నది.

సంపూర్ణము.

---